Regd No. N. 45 / M. 3813

వెల ఒక అణా






ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక



సంపుటము ౧౬ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర వైశాఖబ॥ ౧౫ (౨౧-౫-౧౩౫౦ ఫ.) సోమవారము సంచికి

# క్రీటులో జర్మనుల ఘోరయుద్ధము

## విమానాలనుండి వేలకొలది జర్మను సేనలు దిగుట

### క్రీటులో జర్మను సేనలుదిగుట

ఈసారి ముఖ్యతరమైనవార్త క్రీటులో జర్మను సేనలకును బ్రిటిషు సేనలకును జరుగుచున్న యుద్ధము మే ౨౦వ తేదివాడును ౨౧వ తేదివాడు జర్మను విమానాలు క్రీటుదీవిపై నిరంతరముతిరిగి బాంబులు వేసినవి. దాడిచాలతీవ్రముగానుండెను, మే ౨౦వ తేదివాడు ౧౫౦౦జర్మను సైనికులు విమానాలలో నుండియు, పారషూటులనుండియు అదీవిలో దిగిరి. కానియూ, మాలెమిమధ్యనయుండే సైనికసై న్యకాలను ఆసేనలుపట్టుకొన్నవికాని బ్రిటిషుసేన లుతిరిగి వాటినివశపరచుకొనినవి. మాలెమివిమానా శ్రయమునను పట్టుకొనుటకై జర్మనులు చేసిన ప్రయత్నముకూడ ఆరోజు వ్యర్థమయ్యెను. సాయంకాలము ౫౦౦౦జర్మను సైనికులు విమానాలలో దిగిరి, వారలలో అనేకులు బ్రిటిషువారిచే పట్టుకొనబడిరట సేనలను తెచ్చిన విమానముల నేకములు క్రిందదిగిగా నే భగ్నము లైనవి. మరికొన్ని జర్మను విమానములు సేనలు దింపుటకై భూమిమీద దిగకముందే బ్రిటిషువిమానాలు వాటినెదురుకొని నాశముచేసినవి. ౨౧వ తేదివాడుకూడ చాలాజర్మను సేనలు దిగినవి. బ్రిటిషు సేనలువాటికి చాలనష్టముకలిగించినవి. ఆరోజు జర్మను సేనలు చిన్న నౌకలలోకూడ వచ్చి క్రీటుదీవిపై దిగుటకు యత్నించినట్లు తెలియుచున్నది. కాని ఆ ప్రయత్నములు భగ్నములైనవి. ౨౧వ తేదివాడుకూడ జర్మను సేనలు విమానాలలో నుండియు. పారషూటులలోనుండియు క్రీటుదీవిలో దిగుచు నేయుండినవి, కాని సముద్రంమీదుగా పడవలలోనుండిదిగుటకు యత్నించు సేనలకు అపజయము బ్రిటిషునౌకలు ముంచుటవలన చాలనష్టము కలిగినది. పడవలలోనుండిసేనలు దిగలేకపోయినవి. ఇన్ని దెబ్బలనుతినుచునే జర్మను సేనలుమాలెమి అనుచుండెను. మే ౨౧వ తేదివాటికి పట్టుకొనగలిగినవి, ఇంతేగాకమరికొన్ని చోటులనుకూడ జర్మను సేనలుపట్టుకొన్నవి. మే ౨౨వ తేదిన మరికొన్ని జర్మను సేనలు క్రీటులో దిగినవి, షియస్ దీవిలో ౨౦౦౦, లెస్బాస్ దీవిలో ౬౦౦౦ జర్మను సేనలు ఇపుడున్నవి.

జర్మను సేనలు గ్రీకుదీవులనుండి డోడెకనీస్ దీవుల వైపుపోవుచున్నట్లును, త్వరలో సైప్రసును అవి పట్టుకొనుననియు వార్తలువచ్చినవి. క్రీటులో ఇంకను జర్మను సేనలు దిగుచు నేయున్నవి, బ్రిటిషు సేనలు వాటితో ఘోరముగా పోరాడుచున్నవి. ప్రతిరోజున్ను అనేక జర్మనువిమానములు ఈజియన్ సముద్రంలో తుర్కీ తీరమునకు ఎదురుగా దక్షిణంవైపు ప్రవాహంగా పోవుచున్నట్లును చూచినవారలు చెప్పుచున్నారు. ఈవిధంగా జర్మనులు ఈజియన్ సముద్రంలో ఎక్కడగాని బ్రిటిషుపక్షం వారికి ఏమీఆస్కారం లేకుండా చేయవలెనని యత్నించుచున్నారు.

బ్రిటిషువారు క్రీటులో జర్మను సేనలస్థానముల పై బాంబులు వేయుచున్నవి. గ్రీసులో కూడా జర్మను సేనలుండే స్థానాలపైనను, జర్మనువిమానాలుండే స్థానాలపైనను బ్రిటిషువిమానములు బాంబులు వేయుచున్నవి. మే ౨౧ తేదివాడు ఇట్టిదాడులుచేయబడినవి.

### సిరియాలో డీగాలుగారి సేనలట

రెండవముఖ్యవార్త సిరియాలో డీగాలుగారి సేనలువచ్చిదిగి అక్కడజర్మనులసేనలు ప్రవేశించకుండచేయుటకు యత్నించుచున్నవనునది, సిరియాలో దిగినజర్మను విమానాలపై బ్రిటిషువిమానాలుబాంబులువేయగా, ఫ్రెంచిప్రభుత్వము వారు ఆక్షేపించియుండిరిగదా! ఇపుడు ఫ్రెంచి ప్రధానియగు పెటేను గారును, ఉపప్రధానియగు డార్లాన్ గారును ఇకముందు ఏవిధముగాను బ్రిటిషు విమానములచర్యలనుండి జర్మనువిమానాలను రక్షణముపగ వలెనాయని ఆలోచించుచున్నారు, మొత్తంమీద ఫ్రెంచివారు సిరియాలో జర్మనులకు అవకాశమిచ్చుటకు అన్నివిధములసహకారముచేయుచున్నారు. అలెప్పోలో విమానాశ్రయమును వారుఖాళీచేసినారు. అదిఇప్పుడుజర్మనుల వశంలోనున్నది. సిరియాలో మొత్తం ఇరువైఅంతకుపైగానో విమానములు లేవున్నవి. ఇవన్నియుజర్మనులఉపయోగమునకు ఇపుడుఅందు బాటులోనున్నవి.

డీగాల్ పక్షమువారు ఇపుడు అక్కడ జర్మనులకు అవకాశములు చిక్కకుండచేయుటకు యత్నించుచున్నారు. సిరియాలో పల్మైరా, డమాస్కస్ రాయక్ రాషిద్ లలో జర్మనువిమానాశ్రయాలపై బ్రిటిషువిమానాలు మే ౧౫వ తేదిన బాంబులువేసినపుడు రాయక్ మీద డీగాల్ పక్షపువారి వైమానికులు బాంబులను వేసి క్రిందనుండినజర్మను విమానములనేకములను ధ్వంసముచేసిరి, అవిమానములు ఎగురుకొనుటకై క్రిందనుండినవి వారి విమానములు పైకి పంపబడునపుడు అవిమానాలలోని వైమానికులు బాంబులు వేయకుండ బ్రిటిషువిమానములకు స్వాగతమిచ్చిరట ఈవిధంగా ఫ్రెంచిప్రభుత్వంవారియెడ అవిధేయత చూపినందుకై ౧ ౦ ౪ మ ౦ ది ఫ్రె ౦ చి వైమానికాధికులు అరెస్టుచేయబడినారు. ఇపుడు ఫ్రెంచిప్రభుత్వమువారు సిరియాలో ఉండే బ్రిటిషురాయబారులను ఎనిమిదిరోజులలోగా సిరియానుండిలేచిపొమ్మనినారు. ఆదేశ్రప్రకారము వెళ్లిపోయినారు. విషినుండి ఫ్రెంచి వైమానికమంత్రి సిరియాపై విమానాలదాడులకు రక్షణల నేర్పాటుచేయుటకై సిరియాకువచ్చినారు. ఇది సాకుమాత్రమే యనియు, నిజంగాసిరియాలో డీగాల్ పక్షమువారివైపు ప్రజలలో అభిమానమువ్యాపించకుండ అధిక ప్రయత్నములుకేయుటకై అతడువచ్చినాడనియు అండనువార్తలనుచున్నవి, ఈలోగా డీగాల్ పక్షమువారి ఫ్రెంచిసేనలు సిరియాలో వచ్చిచేరినట్లు మే ౨౧వ తారీఖువాటి అండనువార్తలచే తెలియుచున్నది. అప్పుడే సిరియాలో ఉన్న ఫ్రెంచిసేనలలో నొకదళము డీగాలుపక్షమున చేరినదట, డీగాల్ పక్షమువారికి సహాయము చేసినందుకై అనేకులు సైనికులు, అధికారులు అరెస్టు చేయబడినారట. మే ౧౯వ, ౨౦వ తారీఖులలో సిరియాలో పల్మైరా, డమాస్కస్ విమానాశ్రయాలలో జర్మను విమానాలుమరికొన్ని వచ్చిదిగినవి అపుడు బ్రిటిషు విమానములలో బ్రిటిషు వైమానికులును, డీగాల్ పక్షపువారి వైమానికులును బాంబులను వేసిరి. ఇపుడుసిరియాలోనుండి అమెరికనులును, బ్రిటిషువారును పాలెస్టైనుకు పోవుచున్నారు,

### ఈరాఖు వ్యవహారము

ఈరాఖులో హబానియాకు తూర్పునబాగ్దాదుకుపోవు రోడ్డుమీద ౧౨మైళ్లదూరములో యూఫ్రెటీస్ నదిమీదనున్న ఫలూజాను మే ౨౦వ తారీఖున బ్రిటిషుసేనలుపట్టుకొన్నవి. ఫలూజా నుపట్టుకొనుటవలన యూఫ్రెటీస్ నదిపై మార్గము. ఫలూజావద్దనుండేవంతెనను రాషిదలీ పక్షమువారు భగ్నముచేసియుండినచో, హబానియాకు భూమిమార్గమున బ్రిటిషు సేనలుచేరుటకు వీలులేకపోయియుండెడిది. ఫలూజాపై జర్మను విమానములు బాంబులువేయుటకురాగా బ్రిటిషు విమానములు ఆవిమానములనుతరిమివేసినవి. మే ౨౦వ తారీఖున రాషిద్ విమానాశ్రయముపై బ్రిటిషువిమానములు బాంబులువేసి చాలనష్టముకలిగించినవి జర్మనువిమానములు ఆ వాటిమధ్యాహ్నము హబానియావిమానాశ్రయముపై బాంబులను వేసి. కొద్దినష్టము కలిగించిన - బ్రిటిషువిమానములు అడ్డమువచ్చి రెండుజర్మనువిమానములను క్రిందకూల్చినవి.

ఇంతవరకు ౫౦జర్మనువిమానాలు ఈరాఖులో చేరినట్లు చెప్పుచున్నారు. సిరియానుండిఈరాఖు జర్మనుయుద్ధసామగ్రి తుర్కీగుండాపోయెడి రైలుమార్గాన చేరియుండవచ్చునని అనుమానంతో బ్రిటిషువారు ఆసామగ్రినిఆటుమార్గానపోనీయకుండా చేయుటకై మార్గములాలోచించుచున్నారు, కానితుర్కీగుండా ఆసామానుపంపించబడలేదనికొందరనుచున్నారు- రైలుమార్గంమీదుగాఆసామగ్రి అలెప్పోకు పంపబడెననియుఅక్కడఆసామానునుదింపి ఇరాఖులారీలలో రోడ్డుమార్గమున మోసులకు గొంపోబడెననియు వారలుచెప్పుచున్నారు- ఇపుడురషీదలీగారి అర్థిక మంత్రిసౌదిఅరేబియాకుపోయి అక్కడఇబిన్ సౌదుగారితో సంభాషించుచున్నారు-

### ఫ్రాన్సుజర్మనీల సంబంధము

ఫ్రాన్సులో విషీప్రభుత్వమువారు జర్మనులకు సహకారము అంతకంతకు ఎక్కువగాచేయుచున్నట్లుకనపడుచున్నది- ఇప్పటికినిజర్మనుఅధికారులతో ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధులుకలిసి ఈసహకారవిషయమునుగూర్చి ఆలోచనలు చేయుచునే యున్నారు- జర్మనుఅధికారులు ఒకలక్షమందికి పైగా ఫ్రెంచిసైనికులను ఖైదునుండి వెంటనే విడుదలచేయుటకు అంగీకరించినారు- స్పెయినుజనులకును స్పెయినుపైజర్మనుసేనలుదండెత్తుచో అసేనలకును ఆహారపదార్థములను అందజేయుటకు... ఫ్రాన్సులో జర్మనులుచేర్చుచున్నారు- ఇంతవరకుజర్మనులు ఆక్రమించని ఫ్రాన్సు భాగముకూడ జర్మనులయుద్ధములో తోడ్పడునట్లు ఆర్థికసహకారపుఒడంబడికయొకటి వ్రాసికొనబడినది- ఇందుకుబదులుగా జర్మనులు ఫ్రెంచివారి ఉత్తరఆఫ్రికావిచ్ఛేదముచేయమనిఅంగీకరించినారు- కానిఈఆఫ్రికాప్రదేశమునుండిఇటలీజర్మనీలకు కావలసిన సామగ్రులుమాత్రముతీసికొని పోబడుచునేయుండును- ఇటలీవారుకేసును కావలెనని అడుగుచున్నారు- కాని పెటేయినుగారు అందుకుఅంగీకరించుటలేదు-ఈ విషయాలలో ఇరుపురికిని సమాధానము కుదిరినచో ఫ్రాన్సుజర్మనీ ఇటలీలకుఇపుడుకుదిరినతాత్కాలికసంధిస్థానంలో స్థిరమైనసంధికుదరగలదు- ఇపుడు ఫ్రాన్సులో యంత్రశాలలన్నియు జర్మనులకు యుద్ధానికి కావలసిన సామగ్రులనన్నింటిని తయారుజేసియిచ్చుచున్నది- ఫ్రాన్సులో రోన్ నదిమీదుగాజర్మనుల ఈబోటులను పొకలనుమధ్యధరాసముద్రంలోకిపోనిచ్చుటకు పెటేయినుగారిప్రభుత్వముఅంగీకరించినది- జర్మనులసైనికయంత్రాలను ఫ్రెంచివారు రిపేరీజేయుచున్నారు-

మే ౨౨వ తేదిన బ్రిటిషు పార్లమెంటు కామన్సుసభలో విదేశాంగశాఖ మంత్రియగు ఈడెను గారు విషీప్రభుత్వము బ్రిటిషువారిచే సాగించబడుచున్న యుద్ధమునకు నష్టముకలిగించే చర్యలను జరుగనిచ్చేటయితే బ్రిటిషువారు తమ శత్రువులు ఎక్కడకనిపించినను, అస్థలము జర్మనులు ఆక్రమించినదా కాదాయను విచక్షణఏమియు చేయక, అశత్రువుపై చర్యగైకొనగలరని హెచ్చరికనుచేసిరి-

ఫ్రెంచివారి మొరాకోలోకి జర్మనులుఎక్కువగాచేరుచున్నారని వార్తవచ్చినది. పారిసునగరంలోనుండి అమెరికారాయబార వర్గములను తొలగించి విషీప్రభుత్వస్థానమున్నచోటికి మార్చవలసినదని జర్మనుఅధికారులు కోరినారు- పారిసులోని ఫ్రెంచిరాయబారులను, ఇతర ప్రభుత్వాల రాయబారులనుగూడ అక్కడినుండి తొలగించవలెనని జర్మనుఅధికారులు కోరినారు- ఈతొలగించుటకు జూనుఁ౧౦వ తేదివరకు గడువు యివ్వబడినది-

ఫ్రెంచి ప్రభుత్వమువారు తటస్థదేశాల రేవులలోనుండు తమనౌకలు తిరిగి వచ్చునపుడు బ్రిటిషువారెదురొన్నచో వారికిలొంగక అస్త్ర విఘాతము గావించుకొనవలెనని ఆజ్ఞనిచ్చినారు- మార్టినిక్ దీవిరేవులోనుండి రెండు చాలా వేగముగా పోవు ఓడలు ఫ్రాన్సుకు బయలుదేరనున్నవని తెలిసి అమెరికాప్రభుత్వమువారు వాటిని అపు

# సర్వమత స్వాతంత్ర్యము

## మ. ఘ. వ. నిజాంగారి ప్రతిభాషణము

హైద్రాబాదు [దక్కన్] తేది ౨౦ నుబేదక్కన్ పత్రికలో "తప్పుడుఅభిప్రాయములను తొలగించుట" అనుశీర్షికతో మ.ఘ.వ. నిజాంప్రభువుగారు అధికారేతరాభిప్రాయాన్ని ౧౬ తేదివాటి పత్రికలో ప్రకటింపజేసినారు- అది ఫార్సీభాషలో ఉన్నది- దానిభావమే మరగా-

రహబరెదక్కన్ పత్రికలో ౧౨ రబ్బియుస్సానినాడు ప్రకటితమైన ఒక విషయము మా దృష్టిలోపడినది- "జాతీయగీతము" అను శీర్షికతో నేనుకొన్ని సంవత్సరాలకుముందు వ్రాసిన దానిలోని భావాలను పురస్కరించుకొని అపత్రికలో అభిప్రాయమీయబడినది [అకవితలో మ. ఘ. వ. ప్రభువుగారు ముస్లింప్రజల ప్రభుతయొక్క ప్రజ్వలస్వరూపముఅని వర్ణించినారు] అట్టినాన్ని పురస్కరించుకొని రహబరులోవ్రాయుట పూర్తిగా అల్పజ్ఞానముపై ఆధారపడినది: ముసల్మానుప్రభువుయొక్క హైనీయతతో నేను ఏమేమివ్రాసినానో వాటి అభిప్రాయము సరియైనదే మాకు దానిపై ఆక్షేపణలేదు, మరియు అది మతదృష్టిలో జాజ్వల్యమానముగా ఉన్నది.

అయితే దానికిప్రతిగా మేము వివిధమతాలవారియొక్క ప్రభువులమై యుండుటచేతను ఒక్కమతమువారికే ప్రభువులము కానివారమగుటచేతను, అందరును మాఛత్రఛాయలో సుఖముగా ఆనందముగా జీవనముగడుపుటచేతను ఈ కాంతిలో రెండవప్రకాశముకూడా ఉన్నది. అనగా ఒక్కవర్గానికి కాక అన్నివర్గాలకు మావ్యక్తిత్వము సమానముగా ఛాయాప్రదమైయున్నది: అందుచేతనే మతవిషయాలు రాజకీయవిషయాలును వేరువేరుగా వర్తించవలెయున్నవి, ఈవిధే దాన్ని ఎవరిహృదయములు తంటాలు లేకుండ వర్జితమైయున్నవో అట్టివారే గ్రహించగలుగుతారు, అట్టివారినే విజ్ఞానులనియు రాజకీయవేత్తలనియు అందురు, అట్టివారే దేశీయ కార్యాలను నిర్వహించుటకు సమర్థులు,

మరొకమాట — ఈసమస్యనుగురించి విశదముగా ౧౨ జమాదిస్సానీ ౧౩౫౯ హిజరీ నాటి ఫర్మానులో ప్రకటించినాము,

[గమనిక — ౧౩౫౯ నాటి ఫర్మాను రావడ క్రిందటిది, అందు ప్రభువుగారు తమ ... "అందరిక్షేమము" అనువదే అని వివరించియుండిరి-

మరొకగమనిక — పైఅజ్ఞాపత్రములో ప్రభువుగారు పూర్వము స్వయంగావ్రాసిన ... గీత చర్చకలదు, దానిని ఉర్దూలో "... రానా" అందురు, ౨౨వ జమాదిస్సానీనాటి రహబరులో ప్రకటించినవార్త, దేనిగా ఇస్లాం ప్రభువొకడు మాప్రభువుగారు స్వయముగా ... ము ఇస్లాంమతముయొక్క సూర్యబింబమని ఇస్లాంమతధార్మికులకు నాయకునిగనెన్ని కొనుచుకొనియుండిరి, అని చెప్పియుండెను: దానిమూలము ఫార్సీభాషలో ఇట్లువ్రాయబడినది;

"సిరాజె దీనె ఇస్లామీ
అమీరె మామినాన్ బాషీ"

ఈజాతీయ గీతములోని పైచరణమును పురస్కరించుకొనియే పైభావప్రకటనము ప్రకాశమానమైనది: గో, ప]

టకై తమనౌకాధికారులకు అదేశించిరి. ఆమొదట ఆజ్ఞాపించిరిగాని మరల ఏదో ఒక కారణముచే అఆజ్ఞను వెంటనే యమలుచేయక ఆపియుంచినారు-

### నాజీల కుట్రలు

పూర్వమొకప్పుడు ఈజిప్టు సేనలో ప్రధానాధికారిగ పనిచేసియుండిన జనరల్ అజీజాఅలీ మెస్రీ పాషాగారు మే ౧౬వ తేదిన కెయిరో సమీపంలో ఒకవిమానాశ్రయమునందు విమానమెక్కలేచిపోయిరి, వీరుజర్మనీ, ఇటలీలపైఅభిమానంగలవారట. వీరెక్కడికిపోయినారో తెలియుటలేదు. వారినిపట్టి ఈజిప్టుప్రభుత్వమునకిచ్చినవారికి వేయి పౌనులబహుమానమొసగబడునని ప్రకటనచేయబడినది.

### జర్మనుప్రదేశాలపై బ్రిటిషువిమానాలు

జర్మనుప్రదేశాలపై బ్రిటిషువిమానాలదాడులలో ముఖ్యముఅయినవిశేషము మే ౧౬వ తేదిన బ్రిటిషువిమానాలు ఇంగ్లీషు సేనలు వానుకొని యుండు ఫ్రెంచితీరంలో జర్మనులాక్రమించియున్న ముఖ్యములైనరేవులపైనను, జర్మనులు స్థాపించిన పెద్దతుపాకులపైనను తీవ్రములైనదాడులను చేసినవి- బాంబుప్రేలుళ్లమోతను ఇంగ్లాండుతీరములో భవనము లన్నియుఅదరిపోయినవి. ౧౫వ తేది రాత్రి జర్మనీలో బర్లిను, హానోవరు, లోవియుంటుమున్న గుచోట్లలోనూ విమానాశ్రయములపైనను, పారిశ్రామికాగారాలపైనను బాంబులు వేయబడినవి- ౧౭వ తేదిఅండను రేవుమీదను, కీలులోనౌకాశ్రయముమీదను బాంబులను వేసినవి- ౧౫వ తేది నాటిదాడినుండి ౪ బ్రిటిషువిమానాలుతిరిగిరాలేదు, బ్రిటిషువిమానాలనష్టమింతకంటె ఎక్కువ తెలియరాలేదు-

## వీరశైవసమాజ ప్రథమ వార్షికోత్సవము

(ఒకవిలేఖరి) సదాశివపేట, తీరు ౧౮

శ్రీయుత ధర్మవీరుశరణప్ప షెట్కారు గారి అధ్యక్షతక్రింద షైశాఖశు॥౧౫ బ॥౧ లో జరుపబడెను మొదటిరోజు ఆదివారము ప్రాతఃకాలము ౯ఘంటలకు అధ్యక్షులస్వాగతము శ్రీ పూజ్య మహదేవస్వాములవారి కరకమలముచేత షట్స్థలధ్వజవందనము అయినతరువాత ముగించబడెను అధ్యక్షులవారు అధ్యక్షపీఠము నలంకరించి కార్యారంభము గావించిరి. శ్రీ దేశకేం ద్రమహారాజు గారు ఉద్ఘాటనభాషణచేయుచు వీరశైవులు ఆటువంటిఉత్సవములు అవశ్యము చేయవలసినదని వీరశైవసమాజమువారికి ఐకమత్యము, పండితులసదోపదేశములుఅవశ్యకమనిచెప్పిరి. తరువాత స్వాగతాధ్యక్షులైన పం శ్రీవిరూపాక్షానందస్వాములవారు వీరశైవులకు అష్టవర్ణ షట్స్థల పంచాచారములు ముఖ్యములని ప్రచారకార్యము ను ప్రతిజంగమస్వాములకు ముఖ్యకర్తవ్యమని ముక్తకంఠముతో గంభీరోపన్యాసము గావించిరి. మాదిరెడక్కగారి దుఃఖప్రకటన శ్రీయుత చన్నబసప్పవకీలు గారి మూలమున చేయబడెను. అంతలో అధ్యక్షోపన్యాసము ప్రారంభమయ్యెను. అధ్యక్షులు వీరశైవులకు కాలమానపరిస్థితినను సరించి మనయొక్క విద్యలను అభివృద్ధి చేయవలెనని ప్రతివీరశైవునికివిద్య నేర్పుట ముఖ్యకర్తవ్యమని చెప్పిరి. శ్రీమన్నిరంజనపూజ్య మహదేవస్వాములవారు తమఅమృతవాణితో మిగుల ఆనందము గునట్లు వీరశైవులయొక్క ఉదాత్తతత్వములు ప్రపంచమునకు ఆదర్శప్రాయములని ఆచరించిన సకలమానవులకు కల్యాణము కలుగగలదని ఘంటాఘోషముగా చెప్పిరి శ్రీబసవణ్ణగారు తమయొక్క వచనామృతములో పండితపామరులకు తెలియునట్లుగా కఠినభాషలో ఉన్నటువంటిఅర్థమును సులభమైన కన్నడభాషలో చెప్పిరనియు శ్రీబసవణ్ణగారు జగత్పూజ్యులనియు లోకములో అమితమైనకష్టములకోర్చి మనుష్యులఉన్నతిని కోరినటువంటి మహాత్ములలో గొప్పమహాత్ములనియు అనేక ప్రమాణములచేత వ్యాఖ్యానము గావించిరి, తరువాత శ్రీమతి జయదేవిబాయిలిగాడెగారు శోలాపురంవారు వీరశైవ సమాజములో స్త్రీలకుపురుషులవలె సమానాధికారముండవలెనని పూర్వము శ్రీబసవాదిప్రముఖులకాలములో స్త్రీలు శివశరణీయులై శివశరణులతోపాటు శివానుభవములో పాల్గొని అనేకఅత్యద్భుత కార్యములనుచేసిరని వారందరు స్త్రీలకు మార్గదర్శకులని అక్కమహాదేవి నీలాంబికా మొదలైన శివశరణీయులతత్వములను మిగులప్రేమాదరములతో చదివిఆచరించవలయునని, శ్రీమతిసంగవ్వబాయి మడికెకోలాపూరుగారు కూడ ఈవిషయమునేబలపరుచుచు చెప్పిరి, శ్రీకుమారి శశికలా కోలాపూరుగారు మనోహరమైన వచనయనము చేసిరి. మరియు శివలింగయ్యకుమార చంద్రశేఖరయొక్క గాయనము తరువాత ఈనాటిసభరాత్రి ౧౦గంటలకు ముగింపబడెను.

రెండవరోజు షైశాఖబ॥౧ సోమవారముప్రాతఃకాలము ౭గంటలకుప్రారంభమై శ్రీపం. వీరభద్రశర్మగారు విద్వత్పూర్ణభాషణము గావించిరి. అందులో వారు కన్నడభాష వీరశైవులకు ఎట్లు అత్యవసరమో ఆంధ్రభాషనుకూడ తెలుసుకొనవలయును ఉభయభాషలలో ప్రేమ యుంచవలెను. మరియువీరశైవులు ఇష్టలింగమునుఎందుకు ధారణచేయవలయును. ఇష్టలింగమును పూజించుటచేత దానినిరీక్షణచేత కొంతవేగిరము మనుష్యుడు ఏకాగ్రచిత్తమునుబొంది మనస్సు నిర్మలమై సదానందస్వరూపమైన లింగాంగ సామరస్యమును తెలిసికొని ముక్తినిపొందగలడు. స్థావరలింగమునుపూజించినగాని మరియేవిధమునగాని అతివేగిరము గాప్రాప్తించజాలదు, అందుకనియే వీరశైవమతములోపుట్టినటువంటి ఆధ్యాత్మికశిరోమణులు మహాత్ములు శివశరణులు మరియేసమాజమున గాపుట్టలేదనిరి. ఇట్లనేకవిషయములను విస్తారముగా ౨గంటలవరకు వ్యాఖ్యానము గావించిరి

శ్రీధర్మవరం శ్రీయుతరాచప్ప హారూరు శ్రీశంకరస్వామి అలంపల్లి నాగనాథరావువకీలు మహదేవయ్యవకీలు శ్రీనివాసురావువకీలు శ్రీ గిరిజాదేవి మరియుఅనేకమహాశయులు వ్యాఖ్యానములను గావించిరి. రాత్రి౧౦గంటలకు మహాత్మ్య బసవేశ్వరుల యొక్క జయఘోషలతో సభ ముగించబడెను.

మహిళాసభకూడ జరుపబడెను, ఈసభకు శ్రీమతి హైమాబాయి అధ్యక్షులై జరిపిరి. శ్రీమతి జయదేవిబాయిలి గాడె శ్రీమతి సంగవ్వబాయి మడికె గిరిజాదేవికుమారి శశికలా మరియు అనేక స్వాధ్వీమణుల వ్యాఖ్యానములు గావించబడెను

## భువనగిరి

### రైతులభూమిలో రాళ్లుపాతుట

(స్వ. వి.) ౧౮-౫-౧౩౫౦ ఫ

స్థానికభువనగిరి ౦డి రెండుకోసులు పెద్దను-ఒ కటివల్లగొండకు రెండవది హన్మకొండ హైదరాబాదు- వీటికిరుప్రక్కలవ్యవసాయుచేనులుకలవు- కొంతకాలముక్రింద స్థానికతామీరాతువారురోడుకిరుప్రక్కలపంటచేనులలో మాదేవిగజముల దూరమున రోడుహద్దు రాళ్ళుపాతినట్లు రైతులు మాత్రము మాల్గుజారిబందోబస్తుహద్దుబడు రాళ్ళవరకు ఇంతవరుదనుక తామీరాతువారి అటంకములేకుండసేద్యముచేయుచువచ్చిరి, ప్రస్తుతము తామీరాతువాండ్లు రోడురాళ్ళవరకు తామీరాతు భూమియని, ఇదివరకు మాల్గుజారిబందోబస్తు రాళ్లప్రకారము చేనులరక్షణకు పెట్టుకొనినరైతుల కంపలనుఊడపీకివైచి ఇకముందుదున్నవలదని రైతులకుఆజ్ఞయిచ్చుచున్నట్లు రైతులుగగ్గోలుపడి పైఅధికారులకు విచారణకొరకు విజ్ఞప్తిపంపుకొనుచున్నట్లు తెలియుచున్నది.

సంవత్సరములనుండి మాల్గుజారి బందోబస్తుప్రకారము సేద్యముచేయుచు సర్కారిరకం ఇచ్చుచువచ్చినరైతులభూమిని ఇప్పుడు తామీరాతువారు తమరోడుఅవసరముకు రైతులకు భూమిక్రయము [శెల] ఇవ్వకుండ మాల్గుజారి కం తక్కువ చేయించకుండ బలవంతముగాఅక్రమించుకొనుటయు!రైతులున్నతినిగోరుప్రతివారికి విచారణీయాంశముకాక మానదు.

### పిడుగుపడుట

(ఒకవిలేఖరి)

మహబూబునగరుజిల్లాలోచేరిన నాగరకందనూరుతాలూకాలో కల్వాకొల్లుఅను జాగీరుగ్రామంలో తారీఖు ౫ తీరు ౧౩౫౦ ఫసలిరాత్రి ౫ గంటలకు ౩౦ సంవత్సరములప్రాయముగలవాని పూరియింటిలోపిడుగుబడి అతడు, భార్యవుభయులుమరణించినారు యింటిముందలబర్రె మరణించినది.

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర వైశాఖ బ॥ ౧౫

సోమవారము


## నిజాం కాలేజి

స్కూలుఫైనల్ పరీక్షల ఫలితాలు తెలిసినవి. ఈపరీక్షలో ఉత్తీర్ణులైనవారెందరో కూర్చొనికడ తేరినారు వారికి నిజాంకాలేజీతప్ప గత్యంతరంలేదు. అయితే మనప్రభుత్వమువారు నిజాంకాలేజీలో 300 కన్న ఎక్కువమందినితీసుకోగూడదని శాసించినారు. హిందూ బాలికలలో — ఇంచుమించు అందరును ఉత్తీర్ణులైనవారగుటచేత వారికిని నిజాంకాలేజియే శరణ్యము. అదివిద్యార్థులకే ప్రధానమైన దైనను బాలికలు తక్కువసంఖ్యవారైనను విధాయకము లేక దానినే ఆశ్రయించుచున్నారు. ఈ నిజాంకాలేజీని ఎత్తివేయవలెను అనే సమాలోచన మనరాష్ట్రములో కొందరు చేసియుండిరి- కాని పలువురి అభిప్రాయము విరుద్ధమైనందున దానినుంచుటకే నిర్ణయించిరి. కానిదానిలోనికి విద్యార్థులను తక్కువగాపరిమితముగాతీసుకొనుట వలన స్కూలుఫైనలులో ప్యాసగుట ఒకయెత్తు. నిజాంకాలేజీలో స్థలముదొరికించుకొనుట ఒకయెత్తుగుఅయియున్నది. త్వరలో కాలేజి తెరువబడును. గజారునుండి దరఖాస్తులు కుప్పలు కుప్పలుగా వచ్చిపడును. ఇకవిద్యార్థులు వారిపోషకులును చేసేప్రయత్నాలకుకొదువయేమియు ఉండదు. సిఫారసులు చేయించువారు, కన్నవారి నందరిని ఆశ్రయించువారు, మేముప్యాసుఅయిన దర్జాలనైనా చూడండిఅని మొరపెట్టుకొనువారు, మేము పదితరాల ముల్కీలము కదండీ అనిదీనముగా విలపించువారు, ఇట్టిదృశ్యాలకేమిన్నీ కొదువయుండదు. చరిత్రతీసుకొన్నవారికి కొంత సౌలభ్యము ఉండుననియు, సైన్సుతీసుకొన్న వారికి మహాకష్టమనియువిన్నాము. సైన్సుసంబంధమగు సామానులు పరిమితముగా నుండుటచేత పరిమితసంఖ్యనే తీసుకొందురనుకొంటాము. ఏదియెట్లున్నను ఈ పరిమితి నిర్బంధమునుగురించి ఏటేటఆక్షేపణలు విరివిగా ఏర్పడుచునే వచ్చినవి. ఈనిర్బంధము విద్యావ్యాపకాని కాటంకము. నిజాంకాలేజీలో సందుదొరకని ముల్కీవిద్యార్థులు మద్రాసు లేక ఆంధ్ర విద్యాపీఠాలను ఆశ్రయించవలసినదేనా! ఉస్మానియావిద్యాపీఠములో చేరదమన్న వారికి ఉర్దూరాదాయెను. ఇంతకాలముతర్వాత అఉర్దూరానివిద్యార్థులు ఉర్దూను కొత్తగానేర్చుకొని కాలేజీలో చదువు తెలివి సంపాదించుకొను జాలరనుట అందరునుగ్రహింతురు

బహుకాలమునుండి రాష్ట్రములో ఉన్నతవిద్యావ్యాప్తికి నిజాము కాలేజీ చేసిన సేవ అపారము. రాష్ట్రవిద్యాచరిత్రలో అదొక రమ్యమగుఘట్టము. ఈనాడుహైద్రాబాదులోఉన్నతపదవులలో నుండువారు చాలామంది నిజాం కాలేజివారే. మంత్రులుగా పనిచేసినవారును, తాలూక్దారులును, ఇంజనీయర్లును ఇట్టి గొప్పగొప్పవారును చాలామంది నిజాం కాలేజీయొక్క విద్యార్థులే. ఈనాడు ఉన్నతపదవులలోనున్న వారి కుమారులును నిజాంకాలేజీలోనే ఎక్కువగాచదువుకొనుచు వచ్చినారు.

కొన్నిమాసాలక్రిందట నిజాంకాలేజీ వార్షికోత్సవమునుచేయుచు తత్సందర్భములో దానిప్రిన్సిపాలుగారు విద్యార్థిప్రవేశపరిమితి నిర్బంధాన్నిగురించి తమ అసమ్మతిని సూచించియుండిరి.

ఇప్పటివారికన్న పూర్వముండిన విద్వద్వరేణ్యులును, పూజ్యులునుసర్వజనప్రియులును అయిన టర్నరుగారును ఎన్నిమారులు ఈనిర్బంధానికివ్యతిరేకముగా స్పష్టమగు అభిప్రాయము నిచ్చియుండిరని వినియుంటిమి. అన్నివిధాలా యీనిర్బంధాన్ని తొలగించవలెను. వ్యవధియేమాత్రమున్నూ లేదు. మన ప్రభుత్వమువారు బీదముల్కీలపై దయతలచి యీనిర్బంధాన్ని వెంటనే తీసివేయించగలరని అభిప్రాయపడుచున్నాము.

ఈసంవత్సరము బాలికలు చాలామంచి పరీక్షలో ఉత్తమ స్థానాలను (దర్జాలను) పొందినారు. వారందరును విశేషముగా నిజాంకాలేజీలోనే చేరుదురు. వీలుండిన వారిసంఖ్యనుబట్టి వారికొక సెక్షనువేరేగా నిర్ణయించుట మేలుగానుండును. హైద్రాబాదు పౌరులు తమ అభిప్రాయాలను ప్రభుత్వము వారికి వెల్లడించి యీపరిమితి నిర్బంధాన్ని తొలగింపజేయుదురనితలతుము.

— —

## స్కూల్ ఫైనల్ పరీక్షలు

ఈసంవత్సరము హైద్రాబాదు రాష్ట్రపు స్కూలుఫైనల్ పరీక్షాఫలితములు చాలాముచ్చటగాఉన్నవి. నవాబు మెహిదీయార్జంగు బహద్దరుగారు కన్యకలే యువకులను ఓడగొట్టి పరీక్షా గౌరవములను పొందుటకు ప్రారంభించినారని సెలవిచ్చియుండిరి. వారి అభిప్రాయమిప్పుడు పరిణామమును పొందినదా అన్నట్లున్నది.

ఈ సంవత్సరము ఉత్తీర్ణులైనవారిలో కన్యకలకే అగ్రస్థానము దొరికినది. మొత్తము రాష్ట్రములో స్కూలు ఫైనలుకు కూర్చున్న బాల బాలికలలో మొదటిస్థానము (Dominion first) రెండవస్థానము, నాల్గవస్థానముకన్యలకే లభించినది. ఇది సామాన్యమైన విషయము కాదు ఇదిఅపూర్వమగు విషయము అందులోను ఇంకొకచిత్రమేమనగా హైద్రాబాదు నగరములోని స్టాన్లీబాలికోన్నతపాఠశాలనుండి ౩౭ మంది బాలికలు పరీక్షకుకూర్చున్నారు. అందరికి అందరును కడతేరినారు. ఆ ఉత్తీర్ణతలోను విశిష్టతకలదు. ఏడుగురుప్రథమశ్రేణిలోను తక్కిన ౩౦ మంది ద్వితీయశ్రేణిలోను కడతేరినారు. ఇట్టి ఫలితములను పొందినట్టి స్టాన్లీపాఠశాల ధన్యమైనది. ఈ పాఠశాలలోనిబాలికలే రాష్ట్రమంతటిలోను ప్రథమ, ద్వితీయ, చతుర్థస్థానాలను పొందినారు.

రాష్ట్రమంతటను మొదటిస్థానమందిన బాలిక ఇందూరాజూర్కరు అనునామె. ఆమె రాజూర్కరువకీలుగారి కూతురు. రెండవస్థానముపొందిన కన్యక చిదానందముగారి కూతురైన వసంత రాజ్యలక్ష్మి అనునామె. మొదటి వారు మహారాష్ట్రులు. రెండవవారు ఆంధ్రులు. వీరికి మా హృదయపూర్వకమగు ధన్యవాదాలు. మొదటివారగు ఇందూ రాజూర్కరుకన్యకకు నాలుగేండ్లపాటు నెలకు ౩౦రూ ప్రకారం గోస్లే సహాకార వేతనము లభించును. మూడేండ్లకు ముందు మొట్టమొదటిసారి మొత్తం రాష్ట్రస్కూలు ఫైనల్ విద్యార్థులలో సుభద్రమ్మ అను ఆంధ్రకన్యక ప్రప్రథమ స్థానము వహించినది ఆంధ్రులు మరచిపోయినారేమో. ఇప్పుడు ఉత్తమ స్థానాలపొందిన పైయిరువురి కన్యలను మహారాష్ట్రాంధ్రులు సభచేసి గౌరవించి వారికి ఉత్సాహమును కలిగింతురు గాక!

ప్రప్రథమస్థానమును పొందిన ఇందూరాజూర్కరు కన్యగారు సాధారణ స్థితిలోని వారనియు, వారికి ఇంటిలో ప్రత్యేక బోధకులు లేకుండెననియు, వారు పాఠశాలకు సైనుము నడచియే వెళ్ళుచుండిరనియు, వినుతవ్యాప్తి వారు పొందిన అగ్రస్థానానికి మరింత విలువ హెచ్చుచున్నది వారిని మేము ప్రత్యేకముగా అభినందించుచున్నాము.

— —

## వేంకటరావుగారు స్వార్థ నాయకులు

హైద్రాబాదుస్టేట్ డిప్రెస్డు క్లాసులసంఘమువారు సికింద్రాబాదులో గతించిన ఆదివారము ౧౮ వ నాడు ఒకసభచేసిరి బి నరసింహముగారు అధ్యక్షతవహించిరి ఉపన్యాసకులు తమ సంఘాధ్యక్షులైన బి యస్ వెంకటరావు అనువారి చర్యలనుగురించి తీవ్రముగావిమర్శించిరి. తుదకు ఈక్రిందితీర్మానాలు గావించిరి.

౧ ఈసంఘములోని ముఖ్యులైన యిద్దరి సభ్యులకున్ను అధ్యక్షునికిన్ని అభిప్రాయభేదాలు కలిగినందులకే సంఘము విచారపడుచున్నది ఈ యిద్దరు పెద్దమనుష్యుల వెంకులకు సంఘమునుండి వెళ్లగొట్టినారో విచారించుటకై మహాజనసభను వెంటనే సమావేశను చేయుటకై కార్యదర్శిని కోరుచున్నారు.

౨. కొత్తబోయిగూడాలో ౨౨-౪-౪౧నాడు సభలో అల్లరిచేయుటనుగురించి బి యస్ వెంకటరావుగారు బూతుపదాలను (Rub'ish language) ప్రయోగించుటనుగురించియు ఈ సభవారు తమనిరసనమును తెలుపుచున్నారు

౩. బి.యస్, వెంకటరావుగారియందు ఈసభవారికేమిన్నీ విశ్వాసములేదు. కులస్థులందరును ఆలోచించి సత్కార్యర్థకై అపసవ్యపుపనులను చేయుచున్న బి.యస్ వెంకటరావుగారివలలో పడకుందురుగాక అని హెచ్చరించుచున్నారు.

— —

## పరోపకారార్థం

హైదరాబాదు (దక్కన్), తేది ౧౯ హైద్రాబాదు గౌలీపురాలో గతబుధవారం ఒకబావిలో రాజయ్యఅనువాడు పడెను. కొంతకాలానికి ఖాజామియాఅనువాడు వాన్ని రక్షించుటకై బావిలోదిగెను. అతన్ని ఒకబుట్టలోవేసి పైకించిరి. కానిఅతడు లోనికిపోగా లోపలివిషవాయువులుక్రమ్ముకొని వారిని ఊపిరాడకుండచేసెను, తొందరిగా తమనుపైకిలాగుకొండని కూతవేసిరి. కానిబుట్టసగందూరములో తలక్రిందయ్యెను. కొంతసేపటికి హిందూముసల్మాను లిరువురును మరణించిరి.

— —

## మాడపాటి దక్కన్ విద్యానిధి

హైదరాబాదు (దక్కన్) తేది ౧౯ ౨౩ మేనాడు మాదిరెదక్కన్ గారి చహల్లుం దినం. అనాడే బాబెహుకూమతువారు మ.ఘ.వ. ప్రభువుగారికి తమప్రధానాధ్యక్షులగు రై.అ సర్ అక్బర్ హైదరీగారిద్వారా యిట్లు తెలుపుకొనిరి:-

"మహాఘనతవహించిన ప్రభూ-దిక్కరించగలరు ప్రజలు కీ శే హాజ్రత బడీబేగం సాహెబాగారియెడ భక్తిప్రపత్తులను వెల్లడించినదిగమనించిన మా: రెదక్కన్ విద్యానిధిఅనుపేరగ నిలించినవారి జ్ఞాపకార్థమై ఒకస్మారకము నిర్ణయించుట అవసరమనివెల్లడించగలరు ఈనిధియొక్క ఆదాయము నుండి అన్నికులాలయొక్కయు అన్నిమతాలయొక్కయు బాలబాలికలకు సహాకార వేతనము లియ్యబడును బాబెహుకూమతు సభ్యులందరును దీనికంగీకరించి ౨లక్షల నిధిని ఏర్పాటుచేయుటకు ఒప్పుకొన్నారు. ఈనిధిని పాలించుటకు విద్యామంత్రిగారును డా॥ అయ్యాదుఅయ్యంగారుగారును ఖా॥బ॥అ॥ అల్లావుద్దీన్ గారును సభ్యులుగానుందురు.

శ్రీవారి యథాజ్ఞాపనముగా నెరవేర్చునట్టి శ్రీవారి విశ్వాసపాత్రుడైనసేవకుడు

హైదర్ నవాజ్ జంగ్"

ఫర్మాను

పైవిజ్ఞప్తిని చిత్తగించి మ ఘ.వ. నిజాంప్రభువులుంగారు ఈక్రిందివిధముగా ఫర్మానును ప్రకాశమానం గావించినారు -

"బాబెహుకూమతువారు పంపినవిజ్ఞప్తితో నేనేకీభవించుచున్నాను. నాతల్లిగారిపేర "మాదిరెదక్కన్ విద్యానిధి' అనుపేరుతో నిధిని స్థాపించగలరు. అన్నిమతాలబాలబాలికలకు దానినుండి సహాయంచేయగలరు. దానిపాలనకై ఏర్పాటుచేసిన సమితికూడ సవ్యమైనదిగాఉన్నది. జాతిమతవివక్షతలేకుండాసహాయంచేయుటయేదివ్యసేవనడములో అర్థమేమనగా ప్రతివర్గములో బాలబాలికలకును దానినుండి సహాయంచేయవలెననుట. గతించినవారు ఒకవర్గానికేకాకుండా నాప్రజలందరికిని ప్రియమైనతల్లిగాఉండిరి బాబెహుకూమతువారు ఏర్పాటుచేసినపద్ధతి ప్రశంసాపాత్రముగా ఉన్నది ఆమెఅనంతరముకూడా ఆమెనుస్మరించునట్లుచేసినారు నేను యీమనుమానుషమనుటచేత నేననేకాక ఈదినాన్నినాడు ఆమెపవిత్రాత్మ పరలోకంలో ఆ సెవై ప్రజలు ఎంతటిప్రేమతోభక్తితో చూచుచున్నారో ఆనందించగలదని నేను ఆనందించుచున్నాను. ఇట్టివేతనము కొందరికి లభ్యమగును.

ఈ విషయంలో అవసరమగు నియమాలను ఏర్పాటుచేయుదురు గాక".

—

సర్ టాస్కర్ గారు

హైదరాబాదు (దక్కన్), తేది ౧౯ సర్ టి జె టాస్కరుమంత్రిగారు ఢిల్లీకి వెళ్లినారు వారు ఒకవారములో తిరిగివత్తురు

హైద్రాబాదు శాసనసభ అమర్దాదు నెల మొదటివారములో సమావేశమగును-

— —

ఖాదీ ప్రచార సంఘము

హైద్రాబాదు ఖాదీ ప్రచార సంఘాధ్యక్షులైయుండిన ప్రేంజీ మేఘజీగారు చనిపోయినందున వారిస్థానములో యం.నరసింగరావుగారిని ఎన్నుకొన్నారు డా॥ అతీఫ్ సయ్యదుగారు ఉపాధ్యక్షులు.

— —

ఇత్తెహాదుసభ

హైదరాబాదు(దక్కన్), తేది ౧౯ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ మహాసభ యొక్క వార్షికోత్సవము ౨౯,౩౦,౩౧ మే నెల తేదీలలో జరుగును న॥ బహద్దరుయార్జంగు బ॥ గారు అధ్యక్షతవహింతురు. ఈసభకు ప్రభుత్వమువారు అనుమతి ఇచ్చియున్నారు.

— —

కన్యా గురుకులం

హైదరాబాదు (దక్కన్), తేది౧౯ బేగంపేట కన్యాగురుకులం వార్షికోత్సవం గత గురువారం నాడు జరిగెను. స్వామి రామేశ్వరానందుగారు ఉపన్యసించిరి. బాలికలు తమ కౌశలమును ప్రకటించిరి-శ్రీమతి సుశీలాదేవిగారు నివేదికను చదివిరి. శ్రీ విద్యాపీఠములోని పాఠ్యక్రమము ననుసరించి తమగురుకులంలో తమగురుకులంలో విద్యచెప్పుచున్నామని తెలిపిరి.

—

ఒడ్డీ బేగంగారు

హైదరాబాదు(దక్కన్), తేది౧౯ హాజ్రత బడీబేగం సాహెబా గారి మరణం ౦ వర్షములో వివిధ ప్రాంతాలలో వివిధ వర్గాలవారు ఎడతెగకుండా సానుభూతి సభలు చేయుచున్నారు గతవారము లేడీ బార్టన్ క్లబ్బువారును ఒక సానుభూతిసభ చేసినారు

## నెహ్రూ జీవితచరిత్ర చలన చిత్రంతీస్తారు

పండిట్ జవహర్లాలునెహ్రూగారి జీవితచరిత్రను చిత్రంతీస్తారని హాలీవుడ్ వార్త. యిటీవల నెహ్రూగారి జీవితచరిత్ర అమెరికాలో అమ్ముటయు "Towards Freedom" అను పేరిట గ్రంథాలు విరివిగ అమ్ముడగుచున్నవి బహుశా ఈచిత్రంలోప్రధానభూమిక పాల్ముని వేయనున్నాడని తెలుస్తుంది.

ఇతర క్షేత్రాల్లోయెట్లున్నా ఈచిత్రంపూర్తి అవగానే యిండియాలోనూ ప్రదర్శించబడవచ్చునని తలంచుబడుచున్నది హిందూదేశములో నెహ్రూగారికిగల పూజ్యభావమునుబట్టి ఈచిత్రంయిక్కడయెట్టిఆదరణపొందుతుందో యూహించవచ్చు.

బొంబాయిచౌపతీలో శ్రీ న ర్కులమెట్లా లాఠీచార్జిచేసినది దృశ్యమూ ఆ సమయములో ప్రవీణులైనయిద్దరు సార్జెంటులనుగూడతీసుకొనివెళ్ళవచ్చునని, మరియు చిత్రమునకుఅహింసా సత్యాగ్రహవాతావరణము కల్పించుటకుకొంతమందిసత్యాగ్రహులనుగూడ తీసుకొనివెళ్ళవచ్చునని కూడా తలంచబడుచున్నది.

— —

# గాంధి మహాత్ముని ఆశ్రమము

## గొప్ప పుణ్యక్షేత్రమువలె జనుల నాకర్షించుచు

సేవా(గ్రామమునకు ప్రపంచమందలి అందరి దృష్టులను ఆకర్షించుచున్నవి ఇనియొకపు గామమేనైనను గాంధిమహాత్ముడు అక్కడనివసించుటకుపోయినది మొదలుకొని, ప్రపంచములోని ప్రాంతములనుండియు జనులుఅక్కడికి యాత్రికులవలెపోవుచున్నారు, ఆపయూరులో గాని దయాల్బాగులో గాని శాంతినికేతనంలో గానిక నిపించునటిఅలంకరణము అక్కడపఏదీకనిపించదు అనిప్రొఫెసర్ యమ్. ఆర్. మల్కానిగారు బీసెంటుహాలులో ఉపన్యసించుచు చెప్పిరి

సేవా(గ్రామంలో గాంధిమహాత్ముడుండు కుటీరము ౩౦అడుగులపొడుపు, ౨౦అడుగుల వెడల్పు సుమారు౧౦అడుగులఎత్తుగలిగి, చాలాసాదాగా నుండును.

ఢిల్లీలోచలిఎక్కువగా నుండుటవల్ల చెప్పులు ధరించుచుండు మహాత్ముని పాదములుపగిలినవి. మల్కానిగారు మహాత్ముని కాళ్లకు స్లిప్పర్లు వేసికొనవలసినదనిఅడిగిరట కాని మహాత్ముడు సాదావేషమునందు విపరీతభక్తిగలవాడగుటచే ఎట్టి స్లిప్పరులనుగాని వేసికొననిరాకరించెను. మహాత్ముడుపాదములను కడుగుకొనునపుడు తనముఖమును తేనేకడుగుకొనును. వారికుటీరములోనుండు ప్రతివస్తువున్ను చాలాచౌకయైనది అదిఎల్లప్పుడును సరియైనక్రమములో నుంచబడియుండును, పతిరో జును వారువస్తువులనుమార్చిమార్చి ధరించుచుందురు వాటిపై ఒక్కనుచ్చయైనను లేకుండశుభ్రముగా నుంచబడును. వారెక్కడికైనను పోయిరాగానే చెప్పులనుకడిగి, శుభ్రముచేసి! వాటిస్థానములో నుంచుదురు, అట్టిచెప్పులుమహాత్మునికి అధమపక్షము అయిదేండ్లవరకైనను ఉపయోగించవలెను, భాయిప్రతాప్ గారుసేవా(గ్రామంలో ఏడురోజులుండిరి అంతలో వారికిఅద్భుతమైన అనుభవము కలిగెను. ఒకరోజు భాయిప్రతాప్ గారుమహాత్ముని గదినిఊడ్చెదరు మరియొకరోజు మల్కానిగారు ఊడ్చెదరు మరుసటిరోజు వారలు నీళ్లునింపు పనితీసికొందురు.

మహాత్ముని అవసరములను చాలమట్టుకుతీర్చునదిరాజకుమారి అమృతకౌరుగారు. ఆమెగొప్పవిద్యావంతురాలు. ఆగదిలోఒకఅట్టపై సంక్షేపముగాచెప్పి త్వరగాముగించి, వెళ్లిపొండు, అనివ్రాయబడియుండెను. కాలముయొక్క విలువను నేర్చుకొనగోరు వారందరు అట్టిసిద్ధాంతమునే అనుసరించవలెను కాలమువ్యర్థముచేసి మహాత్ముడెన్నడును ఎరుగడు

మహాత్ముడుప్రుష్ప్రియుడు-ఆయనమకిరకపుపూలు కావలెనని ఎన్నడును చెప్పడు. వారెప్పుడును గానిఈవస్తువుఅందమైనది, అవస్తువికొరకైనది అని చెప్పరు తమఅందమునకుగాని ఇతరులఅందమునకుగాని వారెప్పుడును శ్రద్ధచేయరు ప్రతివస్తువును వారు రుచిగాభుజించుదురు ఒక్కొక్కప్పుడు వారుఒకగంటసేపటికిగాని భోజనము ముగించరు. ఆట్లుకమునిచో ... రుభోజనము నైనను మానుకొని ... కార్యక్రమము చేయకుండ చూచెదరు.

### రోగుల పరిచర్య

సేవా(గ్రామంలో అనేకరోగులున్నారు ఈ మహాత్ములువారిలపైన మనపై స్వయముగా శ్రద్ధ వహించును అక్కడనుండెడిరోగులందరిలోకిన్ని పెద్దరోగి ఒకకుష్ఠరోగి పిచ్చివారలుకూడఅక్కడచికిత్సకై ఉందురు. అట్టివారలనుముగ్గురిని మాచిత నవిమహాత్ముడుచెప్పెను. ఒకరోజుపిచ్చివాడుపోయిమహాత్ముని భార్యచీరనుకాల్చెను. అప్పుడామెవంటయింటిలో నుండెను. మహాత్ముడాపిచ్చివానివద్దకుపోయి సేవానాయకునివలె అతనిని పట్టుకొనిఅతనినిగదికిపంపించివేసెను అపిచ్చివాడును వెంటనేచెప్పినట్లువినెను. మహాదేవదేశాయిగారిభార్యకైజ్వరంతో బాధపడుచుండెను. అప్పుడునుమహాత్ముడు ప్రతిరోజుతిరిగిరాగానే వారివద్దకుపోయిమాట్లాడినవ్వించి వారలబాధలను మరపించుచుండెడివారు. అనేకులు తమగృహకలహములనుతీర్చుకొనుటకై అక్కడికివచ్చుచుందురు. ఒకగొప్పయింటియువకుడొకడుఒకదర్జీవానికూతురిని పెండ్లాడదలచి అందుకుతనతండ్రిని ఒప్పింపజేయవలసినదనిమహాత్మునికోరుటకై సేవా(గ్రామమునకుపోయియుండెను.

పోయినరెండేండ్లుగా తనుమహాత్ముని చూచియుండలేదని మల్కానిగారుచెప్పిరి అందువల్ల మిమ్ములను చూడదలచినానని మహాత్మునకు మల్కానిగారువ్రాయగా, మహాత్ముడుమీయిష్టము వచ్చినపుడు రావచ్చునని చెప్పిరి. అందుపైమల్కానిగారు అక్కడికిపోయిరి. అక్కడగదులన్నియుఆక్రమించబడియుండెను, మహాత్ముడుఅందుపైమల్కానిగారిని తనగదికివచ్చియుండవలసినదనికోరిరి. కానిమల్కానిగారు వేరేగదివిప్పించవలసినదనిఅడిగిరి. ఎంతోకష్టముపై ఖాళీగదొకరకినది.

### మహాత్ముని గుణములు

మహాత్ముడగుటకు (౧) విశేషాంశములనగూర్చిశ్రద్ధ, (౨) సామాన్యలక్షణములను గ్రహించుశక్తి, (౩) వస్తువులయందు గొప్పఅభిలాష, (౪) చతురోక్తిసామర్థ్యము అనునాలుగుగుణములుముఖ్యములనిమల్కానిగారుచెప్పిరి ముఖ్యంగా స్త్రీలపైమహాత్మునిపలుకుబడి ఎక్కువ-వారలుమహాత్ముడుతిరుగబోవునపుడు వారివెంటపోవుదురు, వారిఅవసరములను తీర్చెదరు, సంభాషణలలో వారితోకూడనవ్వుదురు వాక్చాతుర్యముగలవారు గనుకనేమహాత్మునికి పురుషులపైకూడ పలుకుబడిగలదు వారుఏసమాచారముచెప్పినను రమ్యముగను, ముద్దుగను చెప్పెదరు. అప్పుడుదానికి ఒప్పుకొనకుండుటకు ధైర్యమెవరికిని చాలదు. వినోదవచనములయముయందుమహాత్ముడునిజమైనమహాత్ముడుగాకనిపించును వారుజనులందరిని తమమేధాశక్తిచేగాక ఉవిధంగావశపరుచుకొనును. ఈనేర్పులో వారుచాల సమర్థులు.

హిట్లరుతో గాంధిమహాత్ముని పోల్చుచు మల్కానిగారు చెప్పినదేమనగా, హిట్లరుప్రతిచిన్న విషయములోను సంఘముయొక్కకట్టు అధికారముఉండునట్లుచేయును, కాని గాంధిమహాత్ముడు సత్యాహింసలయందు విశ్వాసముతో వాటిని అనుసరించుచుండును.

మహాత్ముడు తనవద్దకువచ్చిన ప్రతివారినిగురించిమనస్సులో జ్ఞాపకముంచుకొనును- వారిసంకల్పముగొప్పబలముకలిది. వారిభావములువారినిగ్రహమునకు అధీనములైయుండును.

మహాత్ముడుప్రతిరోజు వేకువన ౪ గంటలకునిద్రలేచిప్రార్థనచేయును, మరలనిద్రపోవును- తర్వాతతిరుగబోవును- అర్ధగంటసేపుతిరిగివచ్చిస్నానముచేసి, శరీరమును మాలిష్ చేయించుకొనును- పిమ్మట పరభాగ్రత్రప్పును అంతటజాబులువ్రాసుకొని కొంతవిశ్రమించును. మరలతిరిగివచ్చి ప్రార్థనచేయును అనిమల్కానిగారుచెప్పిరి.

---











## జాతరలు, ఉరుసులు, జూన్ 1941

ఈక్రింది ఉత్సవములకేగు యాత్రికుల సౌకర్యమునకై రైలుబండ్లకు పెట్టెలను, మరియు బస్సులను జనసమృద్ధిమునుబట్టి అధికముగా వేయబడును.

బోల్లారమునందుగల యల్లగాంలో తుకారామ్ జాతర
1 వ జూన్ నుండి 5 వ జూన్ 1941 వరకు
45 అప్, 46 డౌన్ రైలుబండ్లను అధికముగా రైలుపెట్టెలువేయబడును.

ఔరంగాబాదులో దౌలతాబాద్ ఉరుసు
5-6 వ జూన్ 1941
అధికముగా రైలుకారులు నడుపును,

భువనగిరిలో జామాల్ షాహ్ ఉరుసు
9 జూన్ నుండి 11 జూన్ వరకు

జాతరలకు ... ప్రత్యేకపు ... ఏర్పాటు చేయుదురు

... ట్రాఫిక్ మేనేజర్,
సికిందరాబాదు
... నిజాం స్టేట్ రైల్వే

## చేనుతగాదాలో కొట్టుట

(ఒకవిలేఖరి)

హైదరాబాదు [దక్కను], తేది ౧౫ మల్కపేట మూసానదిపక్క చేనులో నీటికాలువవిషయంలో కొంతమంది మర్గయ్యయాదవ పైపగపట్టి మే ౩వతేదిరాత్రి ౧౦ గం వాసు చేనులో పనిచూచుకొనుచుండగా లా రాళ్ళుమున్నగువానితో విపరీతముగ కొట్టగా మర్గయ్యగారు స్పృహతప్పిపడిపోయిరి. వెంటనే యీసంగతిపోలీసువారికి తెలుపబడెను. మర్గయ్యగారిని సుల్తానుబజారు దవాఖానాచేర్చిరి. మే ౧౫వతేదిన వారుదవాఖానాలోనే చనిపోయినారు. పిమ్మట ఉస్మానియా దవాఖానాలో శవపరీక్షచేసి ౭వ ... వారసులకిచ్చివేసిరి. ఈముండగీం ... పట్టుటకు పోలీసువారుప్రయత్నములుచేయుచున్నారు.

## పిండిపాకల ఆనకట్ట

హైదరాబాదుప్రభుత్వమువారు మూడేండ్లక్రిందటనల్లగొండజిల్లాలోని దేవరకొండ తాలూకాలో వ్యవసాయపనలికిగాను పిండిపాకలవద్ద ఆనకట్టకట్టుచున్నారు. అది మొన్న మొన్న నేపూర్తి అయినది దానికిగాను ౬లక్షల ౨౫వేలు రూపాయీలుఖర్చయినవి. ఈతాలూకాలోనికి పారేటట్టి ఉప్పలవాగునను అడ్డముగా కట్టువేసినారు. అందుచేతఈవాగునీరు పెద్దవైశాల్యంలోఆగిపోవుననుమాటఒకటిన్నరమైలు వైశాల్యంలో నీరునిల్చును, దానినుండి ౭మైళ్లపొడుపుకాలువను తీసినారు. ఇప్పుడు ౨౫౦౦ ఎకరాలతరీసిస్తు దీనిక్రింద ప్రారంభమైంది ఎంకారెండేండ్ల కాలములో ౫౦౦౦ ఎకరాలవరకునిస్తు పన్నుతేవసూలు చేయుదురు

## ఆంధ్ర యువతీ మండలి

హైదరాబాదు (దక్కన్) తేది ౧౫:

మే ౧౫ ఆదివారంనాడు సాయంకాలం ఆంధ్రయువతీమండలి యాజమాన్యంలో శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయంలో శ్రీరంగమ్మ రెడ్డిగారి అధ్యక్షతలో స్త్రీలు ఉద్యోగములలో పాల్గొనవచ్చునా అనువిషయముపై బహిరంగచర్చలుజరుపబడెను. శ్రీమంచెళ్ల స్వరాజ్యలక్ష్మీదేవి, సీతాకుమారిగార్లుఅనుకూలముగాను శ్రీ అనంత లక్ష్మీదేవి, ఇ. శ్యామలాదేవిగార్లుప్రతికూలంగానూమాట్లాడినారు. చర్చలు చాలాఉత్సాహంగాజరిగాయి. ఒక్క ఓటుబేధంతోఅనుకూలపక్షంవారుగెలిచినారు. శ్రీరంగమ్మరెడ్డిగారు

## పెద్దెముల

పాండురంగ విగ్రహస్థాపన

(ఒకవిలేఖరి)

౧౫-౫-౪౧ న.

... గ్రామమునుండి ఒకమైలుపైన జనగామకలదు- అక్కడ దేవాలయము కట్టబడుచున్నదని లోగడపత్రికలలో ప్రకటించియుంటిమి- అట్టిదేవాలయంకట్టబడి శ్రీపాండురంగ, రుక్మాబాయి రెండువిగ్రహములు హోమముపూజలతో మహానీయులచేస్థాపించబడెను- రెండుదివసములు భజనలు రాత్రింబగలుజరిగెను. ఇతరగ్రామాలనుండి వేలకొలదిజనులువచ్చియుండిరి- యాత్రీకులందరికి భోజనఏర్పాట్లు మరియు యితరఖర్చులు రా. రెడ్డిపటేల్ మరియువారిఅత్తయగు మద్దూరుపల్లి రామమ్మగారలుచేసిరి. రెండురోజులయాత్రీకులందరికి ఉచితముగా తేనీరు మోహన్‌లాల్ గారు సమర్పించుకొనిరి.

## హరిజన ప్రచారము

హైదరాబాదు (దక్కను), తేది౧౫:

౧౬-౫-౪౧మొదలుకొని జెయం. బాల్‌రాంగారు బద్వన్నపేట, మన్‌నూర్, గురుకుంట్ల ఘోర్‌నాల, భాత, నంగనూరు, యీయీగ్రామములలో హరిజనులవాడలలోనికివెళ్లి అహింసాతత్వమును పారిశుభ్రతను, మద్యపానవిషయము చక్కగావారియిండ్లకువెళ్లి ప్రబోధించినారు,

స్త్రీలఉద్యోగ్యాల్లోపాల్గొంటంలోని లాభనష్టాలనుగురించి చాలాదీర్ఘంగాఉపన్యసించినతరువాత కృతజ్ఞతలతో సమావేశంచాలింపబడినది.



## విదేశ వార్తలు

యుద్ధానంతర ప్రపంచనిర్మాణమును గూర్చి స్మట్సుగారి సూచన

మే ౧౫వతేదిరాత్రి రేడియోలో ఉపన్యసించుచూ దక్షిణాఫ్రికా ప్రధాని స్మట్సు గారుఇట్లు చెప్పిరి.

"యుద్ధం మూడువిషయుల ముగియవచ్చును. ౧. సైనికంగా ఎటుఇటు తేలక ప్రతిష్టంభన మేర్పడుట ౨ జర్మనువిజయము. ౩ మిత్రమండలి విజయము.

ఆఖరిగా మిత్రమండలివిజయం సంభవించినప్పుడు, చిన్నచిన్న స్వతంత్రరాజ్యాలుండే కాలంపోయినది, ఎక్కువమందిజనము ఒకటిగాచేరగలరు- జీవితనీతిసూత్రాలు, రాజకీయతత్వము ఒకరీతిగకలిగి, భాష, సారస్వతసంబంధముగట్టిగాగలిగిన బ్రిటిషుసామ్రాజ్యము, అమెరికాకేంద్రముగానుండును. వాటితర్వాత, హిట్లరుకుబలియైన ప్రజాస్వామికములు, తుల్యస్వభావముగల మరికొన్ని రాజ్యములువచ్చును,పాతపగుపులపట్లకసితో ఏచర్యనుపూనుకొనుట లేదు. ఈనిర్మాణమునందు ముందంజవేసేవిషయం అమెరికా వైఖరిపై ఆధారపడియుండును."

చియాంగుకేషేక్ గారి విజ్ఞప్తి

మిత్రరాజ్యములకు చైనాఅధిపతియగు చియాంగుకేషేక్ గారిట్లువిజ్ఞప్తిచేసిరి:-

"ఇంగ్లండు అమెరికా సంయుక్తరాజ్యముల వోటిమిత్రరాజ్యములు చైనాకు అర్థికసహాయము అయుధసహాయముచేయుచో, జపానును చైనా ఓడించగలుగును. తమశత్రువగు జపానునుఓడించుటకు అదేశములు తమసైన్యములను పంపనవసరము లేదు."

చైనాకు క్రొత్తబ్రిటిషు రాయబారి వచ్చుచున్నాడు. ప్రాతరాయబారికి వీడ్కోలోసగుసందర్భమున చియాంగుకేషేక్ గారి ఉపన్యాసము గావించిరి.

అమెరికా దక్షిణమున బొగ్గు పనివారి సమ్మె

యునైటెడు మైనువర్కరుల యూనియను ౨౦దినములు సమ్మెకట్టియుండెను- అదిఏప్రెలు ౨౯న రూజ్వెల్టు జోక్యంవల్ల దినానికి ఒక డాలరు హెచ్చుచేస్తామని యజమానులు అంగీకరించినందున, ముగిసెను-కొత్తఒడంబడికమాటలు జరుగుచున్నవి గాని దక్షిణమున మెత్తటిబొగ్గు తీసే పనివారిసమ్మె జరగక తప్పేటట్లులేదని యజమానులు, కార్మిక నాయకులుగూడ అభిప్రాయపడుచున్నారు-

కార్డెలుహల్లుగారి అభిప్రాయం

అమెరికావిదేశాంగ కార్యదర్శియగు కార్డెలు హల్లుగారు సెనేటుసభకుసంబంధించిన వ్యాపార శాఖాసంఘమునకు యీక్రిందరీతిగా ఒకలేఖ వ్రాసిరి.

'అమెరికా రేవులలోఉన్న పరాజితరాజ్యాల నావలను అక్షరాజ్యలనావలను అమెరికాప్రభుత్వంవశపరచుకొని వినియోగించుటలో ఎట్టిప్రతిబంధకములునుఉండరాదు.'

రియరుఅడ్మిరలులాండు గారు సమసుకమిటీవద్దట గతవారంసాక్ష్యమొసంగుచు ఇట్లుచెప్పిరి:-

ఈనావలలోసరుకువేసి ఇంగ్లాండుకురవాణా చేయవలెను. యుద్ధరంగమువైనసముద్రప్రాంతాలలోప్రయాణంచేయునప్పుడు అమెరికాప్రభుత్వపుజెండాతోసదరునావలు ప్రయాణంచేయవలెను. అట్టిప్రాంతాలుఏవో అమెరికాతాటస్థ్యనిర్ణయచట్టములలోపేర్కొనబడినవి."



## అంతర్జాతీయ సంస్కార యువకసభ

పాట్నానగరములోని యువకులు

అంతర్జాతీయసంస్కారి(Radical) యువకసభ ఒకటిఏర్పడి ఒకమహాసభను ఆగస్టునెలలో కావింపనున్నారు. దానిఅధ్యక్షులుగా ఆంగ్లస్థానములోనిసుప్రసిద్ధ పండితులగు హారోల్డులాస్కీ అనువారిని ఆహ్వానించినారు. వారునుఅంగీకరించినారు. వారితోకూడ చాంకేషేక్, అల్డోస్ హక్సిలీ మున్నగువారినికూడ ఆహ్వానించినారు.